# అమరావతి మాహాత్మ్యము.

ఇది

గుంటూరు మండలములోని కుమ్మరపూడివాసియగు

మల్లాది అనంతరామయ్యచే

రచియింపబడియె.

500 ప్రతులు.

కే. బి. క్రిష్ణారావుచే

[illegible] వాణీముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1914.

వెల రు 0-1-0.



# పీఠిక.

---

ఆర్యులారా, మీయందరికొక విన్నపంబు విన్నవించుకొనుచున్నవాఁడ. అదియేమన నే నంధుఁడను గణయతిప్రాస లక్షణంబు లెఱుఁగను. నేను కోరికతో రచియించిన యీ చిన్నపాత్రమునందలి తప్పులమన్నించి యొప్పుల గ్రహింప వేఁడుచున్నవాఁడ.

ఇట్లు విధేయుఁడు,

☞ మల్లాది అనంతరామయ్య.

---

శ్రీరస్తు.

# అమరావతి మాహాత్మ్యము.

క॥ శ్రీరామ దశరథాత్మజ
కారుణ్యా నిఖిలరక్షకా హారవినుతా
ఘోరరణశూరకరుణాను
రారా నన్బ్రోవవేగ రఘుకులతిలకా॥

(గణపతి ప్రార్థన)

గీ॥ శ్రీవినాయక పార్వతీ చిన్నికుఱ్ఱ
ఏకదంతుఁడ నినుభువి నెల్లప్రజలు
మొదలదలఁచెదరే కార్యమునకు, మేలు
కలుఁగ మ్రొక్కెద ననుఁగృపఁ గావుమయ్య॥

ఘనచింత నొందుచుంటిని
వినియెద నొక సుకథఁ జెప్పవే ముద మొదవన్॥

వ॥ అనిన నమ్మునీంద్రుండు సంతసించి నీ వేకథ వినఁదలంచితివని యడుగ
నారాజేంద్రుండిట్లనియె॥

క॥ ధర నమరావతియను న
ప్పురమున కా నామమెటుల బుట్టెను హరుఁడా
పురి వెలయుట కేకారణ
మెరిగింపవె పుణ్యచరిత యీసమయమునన్॥

క॥ అనియడిగిన నరవరునకు
మునివరుఁ డిట్లనియె పాండుపుత్రా వినుమా
ఘనచరితము రసభరితము
విన దురితములెల్లఁ బాయు వినుపింతునికన్॥

క॥ ధారుణి మున్నొక దనుజుఁడు
తారకనాముఁడు ఘోరతపమొనరింపన్
వారిజగర్భుఁడు మెచ్చి యు
దారత వరములనొసంగ దయనేతెంచెన్॥

సీ॥ ఇటులఁ జనుదెంచినట్టి వాణీశుఁగాంచి
తారకుఁడు సంతసించి "విధాత! యమర
యక్ష గంధర్వ విద్యాధరాదులందు
నాకు జయ మొంద వరమిమ్మనంగ నలువ॥

క॥ బాలుండొక్కఁడు దప్పఁగ
నేలోకమునందునైన నెవ్వనినైనన్
లీలనుజయింపఁగలవు ను
శీలుడవై యుండుమిలను చిరకాలంబున్॥

సీ॥ ధాత్రికేతెంచి సంఘనతపమునకును
మెచ్చి నీకోరువరము నేనిచ్చితిపుడు
గాన మిక్కిలిసత్కీర్తిఁ గాంచుచుండు
మధికసుఖమై వెలిఁగెద వసురనాథ॥

వ॥ అని యిట్టుల వరంబులిచ్చి విరించి తనలోకంబునకేఁగనిచెప్పి ముని వరుండిట్లనియె॥

ఉ॥ అంతటఁ దారకుండుచని న్యాయమువీడి సురేంద్రువీటిలో
వంతలఁబెట్ట దేవతులు వానికిజంకుచునుండ నాశచీ
కాంతుఁడుబారి యొక్క సుమగర్భమునందునడాగియుండె, భూ
కాంతవరేణ్యా, రాతని మొగంబునుజూడ భయంబు [illegible]॥

వ॥ అనిన ధర్మజుండిట్లనియె॥

క॥ మునిచంద్ర క్రూరుఁడగు నా
దనుజానిద్రుంపఁగ వజ్రి ధైర్యము లేకన్
జనియొవని చెప్పినాఁడవు
ఘనబలుఁడింద్రుండు వెరువఁగాఁబనియేలా॥

వ॥ అనిన మునీంద్రుండిట్లనియె॥

గీ॥ దనుజకంఠమునను బర్వతంబుకరణి
వ్రేలు నొకలింగము జనులు వెరపుజెంద
నతనిప్రాణంబు లా లింగమందుఁగలవ
టంచు నేరునుఁ దెలియలేరైరి భువిని॥

గీ॥ అందుచేతన సురలోకమాత తనకు
వశముగావించుకొని దేవవైరిబాధ

బెట్టుచుండఁగ నింద్రుండు వీకుఁడయ్యెఁ
బారిపుష్పంబులోఁ దాఁగవలసె నధిప॥

వ॥ అప్పుడు దేవతులు తమ మనంబున॥

ఉ॥ ఎంతటియాపదల్ గలిఁగె నింద్రునివీటికి నిట్టివేళ నీ
యంతకునిన్ వధింప మనమందరమైననుఁ జాలమంచు శ్రీ
కాంతుని వేఁడుచున్ గరళకంఠునినమ్ముచు ధాతనెంచి వా
రంతటఁబోవనెంచిరి సురాధిపుఁడైన విరించివీటికిన్॥

క॥ సురలంత ధాత చెంతకు
నరిగి దనుజు క్రూరకృత్యమంతయు నుడువన్
సరసిజగర్భుఁడు మొరవిని
సురలకునిట్లనియె ప్రేమఁజూపుచును మదిన్॥

మ॥ వెరవున్ వీడుఁడి వేల్పులార వినుఁడీ వేగంబునం దారకా
సురునిం జంపగలాడు లేఁడు ధరపైఁ జూడంగ మీరేగి శ్రీ
హరునిన్ వేడుఁడి భక్తితోడ నటఁ గార్యంబెల్ల సిద్ధించు దు
ష్చరితుండిల్లు శుభంబు గల్గుఁ జనుఁడీ శంకింపమీ కేటికిన్॥

క॥ అనిమును నలువ పలుకులు
విని వేల్పులు గొంత చింత విడి శివనిలయం
బున కేగుచుఁ దమమదిని
ట్లనుచు వితర్కింపఁ జొచ్చి రవనీనాథా॥

చ॥ అరుఁగుచునుంటిమచ్చటికి నాపరమేశుఁడు గోపగించునో
కరుణనుఁ బ్రోచునో గరళకంఠుడు క్రూరులమంచుఁ బల్కునో,
పురహరుఁడేలఁ బల్కు దయఁ బ్రోచును, బ్రోవక యెగ్గు సేయునే
హరుఁడు కృపారసాబ్ధి మనయందొకయించుక ప్రేమఁ జూపఁడే॥

వ॥ ఇట్టులఁ దమమనంబున వితర్కించుకొనుచుఁ గుబేరుని పట్టణంబుఁ
గడచి॥

క॥ సురలవుష్కనిరి హరుకా
పురమును ఘనదురితహరము మునిజనవరసం
భరితము చింతాహరమున్
సురపురిక్రియ వెలుగుచుండు శూలిపురంబున్॥

గీ॥ కనియె బిమ్మట దేవతాగణము వెండి
పర్వతంబున నివసించు సర్వమయుని
చంద్రచూడుని హరుని భుజంగధరుని
సాధుజనపోషబిరుదుని సాంబశివుని॥

గీ! మూడుకన్నులుగలవాని భూతపతిని
కాయమెల్లవిభూతిని బూయువాని

స్త్రీయొ పురుషుఁడో రెంటనుఁ దెలియకుండ
నున్నవానిని గాలిలో నున్నవాని॥

ఉ॥ కుక్షిలేనివారలకుఁ గోరినసంపదలిచ్చు మేటినిన్
భిక్షమునెత్తువానినిఁ గుబేరునిమిత్రుని సర్వలోకముల్
రక్షణసేయువానిని దురాత్ములఁబట్టి వధించువాని ఫా
లాక్షుని జేరిమ్రొక్కి సురలంతనుతించిరి భక్తితోడుతన్॥

క॥ ధాతవయి సృష్టిచేసెదు
భూతలమున జంతుకోటిఁ బ్రోచెదుహరివై
భూతేశుడవై లయము
జేతువు మమ్మిపుడు రక్షసేయఁగ లేవే॥

క॥ వార మున్ను మేము వేడఁగ
గరళానలబాధమాన్పి కాపాడవె నిన్

మఱువక దలంచుచుందుము
కరుణాపరతంత్రు నీలకంధరమమ్మున్॥

క॥ తారకుఁడను నొకదనుజుఁడు
క్రూరుఁడు మాపురముఁజొచ్చి గొబ్బననింద్రుం
బారఁగఁజేసెను మము ని
ష్కారణముగ బాధనొంచెఁ గనవె దురాత్మున్॥

క॥ దేవా యీకార్యమునకు
నీవే యాధారమనుచు నీరజగర్భుం
డావంతఁ దెల్పవచ్చితి
మీవేశా పాడవలయు నీసమయమునన్॥

వ॥ సు లివ్విధమున మొదలిడఁ గరుణాసముద్రుండైన హరుండు భయం
బుఁవీడిపొండని యానతిచ్చె. తదనంతరంబఁ దనభార్యయగు భార్వ

తింగూడి రతిం దేలుసమయంబున విరోధియగు మన్మథుండు గామం
బుఁబుట్టింపమిం జేసి శివునకు వీర్యపతనంబుగామిఁ బార్వతి వేసరి రో
షించి దేవతలచే నిట్లయ్యెనని యెంచి యాదేవతాసంఘంబునకు శా
పంబిచ్చెదవన,

ఉ॥ కుందుచునంతరంబున ముకుందుని వీక్షింపోయి దేవతా
బృందముభక్తిఁ గోడను విభీషణుఁ బోషకుఁ జేరి మ్రొక్కి గో
వింద హరీ మురారియని వేఁడుచు గల్గిన బాధఁ దెల్ప నా
నందనిమాన్పనెంచి హరి సంతసమొంది కుమారునిట్లనున్॥

వ॥ మన్మథా యచటశివునకు మోహంబు లేకున్నవాఁడు. అతనికి మో
హంబుగల్పించి పార్వతీశాపంబు బారినుండి దేవతల రక్షింపుమనిన
మదనుండిట్లనియె॥

క॥ హరి! నీయాజ్ఞను జనుటకు
వెలిఁవను నామనవి నొకటి విను నే నేఁగన్
హరుఁడు దనకోపవహ్నిని
బరిమార్చును నన్నుఁదనదు పగతుఁడనగుటన్॥

వ॥ తండ్రీ! నేను నీవుచెప్పినట్లు శివునికి మోహంబుఁగల్పింపనేగి యచ
ట మదనపద నందుచే నిన్ను విడచి నీపాదసేవ మానవలసివచ్చుఁగా
న నేఁగైలాసంబునకుఁ బోనొల్లనని వాసుదేవుండిట్లనియె॥

క॥ నందన మృతిఁజెందెదనని
కుందగనీకేల ముందు గొమరుడవై నా
యందున జననంబొందెదు
కందర్పుఁడవమ్ము సురలఁ గాచుటకొరకై॥

క॥ అనిహారి చెప్పిన మదనుఁడు
విని కైలాసమునకేగి విశిశరములచే
ఘనబాధయుందుముంచ శి
వునికనుపమ మోహామవుకు బుట్టెన కేంద్రా॥

వ॥ శివునికి వీర్యంబుద్భవించి పార్వతిగర్భంబుఁ జొరబోవుసమయమున॥

చ॥ హరుసతులంతఖండ దమకంబరవీధిని నిల్చి శూరుఁడై
శరములు వేయుమన్మథుని శాంభవికన్నులజంచి సిగ్గునం
బురుషుఁడొకండువచ్చినని భొల్లున కేకను వేయ కోపియై
హరుఁడువధంచె గామునయనానలకీలలఁ గాల్చిభూవరా॥

వ॥ అప్పుడావీర్యంబు యు క్తస్థానంబునంబడక గుప్పుగుప్పుమని చప్పు
ములునెడల ననలంబుభంగి వెలుంగుచు భూతలంబునఁ బారెనంత॥

ఉ॥ కాంతుమ్ము మగ్గెనంచు రతి గన్నులఁదోయకణంబులొల్కఁగా
జంతిలుచుండి పోయి హరుచెంతనుఁ జేరి నమస్కరించి ని
న్నంతరమందు మారుకు హరాయని వేఁడుచునుండునట్టి నా
కాంతునిఁ జంపఁగాఁదగునె కారుణసాంద్రుఁడ హా మహేశ్వరా॥

క॥ ధారుణిలో ప్రాణులకుం
దీరని మోహంబునిచ్చు ధీరుండును స
త్పూరుషుఁడు నాదు పెనిమిటి
నీరీతి వధింప న్యాయమె నీకు శివా॥

వ॥ అని రతీదేవి పతిభిక్షంబుఁ బెట్టుమని వేడిన హరుండు కరుణించి యి
ట్లనియె॥

చ॥ పెనిమిటి ప్రమగ్గనంచు మదిఁ బెల్లుగ దుఃఖము నొందకేవు నీ
మనమున నెన్ను నాఁడవుడె మారుఁడు చెంతకు వచ్చు నీకథం

గనుగొనిపోవుచుండును సుఖంబుగనుండుమటంచుఁ దెల్పగా
జనియెదనంచుసాధ్వి రతి శంభునివీడి ముదంబునంజనెన్॥

వ॥ అంత ఋషిమండలంబున సప్తమహాఋషులభార్యలైన యరుంధతి మొదలుగాఁగల యేడ్వురంగనలు చెంగున గంగకుంజని యుదకంబుఁదెత్తుమని హృదయంబున ముదంబునొందిపోవుచు॥

క॥ చెంగునకనిరి ఋషిసతులు
పొంగుచు భోరనుచుపారు పురహరుజటలో
సంగనఁ బాపవిభంగన్
నింగికెగయు నలలతోడ నిండినగంగన్॥

గీ॥ అంత నదిఁ జేరి యచ్చట నాపడతులు
'నీరుగొంపోవకుండయే నిలచియుచట

వెతలుచుండిన శంభుని వీర్యమువెస
జూచుచుండిరయాశలి సుదతిదక్క॥

వ॥ నరేంద్రా! యరుంధతి యేకార్యంబైనం బరికించి చేయుచుండును
గాన నక్కాంతామణి వారికిటుగింత వివనందున వచ్చిన కార్యంబు
గావించుకొని తిరిగి తన నెలవునకుం బనియె నంత నిచ్చట॥

గీ॥ చూడరేమీరు చెలులార చోద్యముగను
యరుగుచున్నది మూదు దావాగ్ని చూడం
దపనుడో లేక చంద్రుడో దహనుడో యన
వెలుగుచున్నది కనులకు వేడ్కపాడమ॥

వ॥ యివ్విధంబున నవ్వనితలు మనంబున నబ్బురపడుచు నదియునుంగా
క నాసమయంబుదయంబుగావున చలిచే గడగడవడంకుచు॥

ఉ॥ కాంతలు వేగఁబోయి చలిగాచుక వత్తుమటంచు జేలలై
చెంతకుఁదోయి వీర్యమునుఁ జేతులఁజాచుచు కౌగలింప నా
యింతుల గర్భభాగమున కీశ్వరునింద్రియమేఁగ నప్పుడా
కాంతలు గర్భధారణముగాఁగఁ గుమారులఁగాంచి రార్యరున్॥

వ॥ అంత నామగువలు దాము జారిణులను నిందపాలగుదుమని వెఱవు
న దమబిడ్డల నచటఁబారవైచి నదీతీరంబునకేగి యెప్పటియట్ల నీ
రాటఁగొంటకై యుసుకతోఁ బాత్రలఁనిర్మింపఁబోవుతఱి వారిపాతి
వ్రత్యంబు భంగంబగుటచే నాయిసుక ఘటరూపంబుదాల్పదయ్యె.
అందులకా కాంతలు చింతిల్లి తమనిలయంబులకుఁ జలంబులేక యే
పోయిరి. అట్లువచ్చినవారిం గని వారిభర్తలు కోపించి॥

ఉ॥ నీరముఁదెత్తుమంచుఁజని నీరొకయింతయులేక యిట్లురాఁ
గారణమేమొ తెల్పుఁడనఁగా సతులూరకయుండ. నావదీ

తీరమునందుచన్న విధి తెల్లముగా దమదివ్యచక్షుచే
వారలుగాంచి యంత నిజభార్యలవీడిరి కోపదృష్టితోన॥

క॥ ఆ కాంతలు భర్తలచే
వాకిలి వెడలంగ గొట్టఁబడి యుండుటచే
శోకంబునొందుచుం జని
యాకసమునవిలచిరప్పు డవనీనాథా॥

వ॥ అంత గంగానదీతీరంబునఁ బిల్లలను మార్గవశంబునఁగాంచి యఖి
లలోకసంచారుండగు నారదుండు॥

సీ॥ ఈ బాలకులతల్లులెవ్వరో యీబాలు రీయడవినిటు లేడ్వనేల
నో బ్రాహ్మణులో క్షత్రియులో వైశ్యులో శూద్రులో వీరికులము
ద్దియో యెఱుంగ। గన్నతల్లికినిట్లుఁ గల్గునే కఠినంబు బాలురనీరీతిఁ
బారవేయ। ననుచువీరలనేరి కైననిచ్చెదనంచు నెత్తుకపోవంచియే

కదుగను॥ గీ॥ కాగిటం జేర్చ శిశువుల కాయములొకొ। టొకటికల
సి తలలుఁ జేతులున్నయట్లు॥ యుండి యారుతలలును బంద్రెండు చే
తు। లున్న యొక బాలుఁ డేర్పడెనొ మహీశ॥

వ॥ అంతన బ్బాలుండు గుహుండై కనులగ్ని కణంబుల భాతి వెలుంగఁ దన్ను
బుట్టించినయున్న తాపసి గాంచి నీవెవ్వఁడవనియడుగ నారదుం డి
ట్లాయ్యరు శిశువులు నొక్క బాలుఁడగుటకును మఱియు నబ్బాలుం
డు గుహుండై మాటలాడఁగలుగుటకును నబ్బురమంది తన్నుం జం
పునేమోయని భయంబుగూడఁగలుగ నంతటి బాలుం డీశ్వరపు
త్రుండై యుండనోపునని తన దివ్యదృష్టిచేగనుంగొని॥

వ॥ హరసుత నన్ను నారదుఁడటందురు లోకులు సర్వలోకసం
చరుఁడను। బహ్మపుత్రుఁడను శంభుపురంబున కేఁగుచుంటినం

: చెఱఁగఁగవిన్నవించి గిరిశేశ్వరుపుత్రు నుతించి వేగఁ డా
సరిగను నారదుండు త్రిపురాంతకుపీటికి సమ్ముదంబునన్॥

వ॥ అట్లేఁగి యానలువట్టి శివునకు జరిగినవృత్తంబెల్ల నెఱింగింప శి
వుండు సంతసించి తనకుమారుఁడగు గుమారుని సన్నిధానంబునకే
తెంచి సుతునిముద్దాడె. కాని కోపోద్రేకుండగు నబ్బాలుండుఁ దం
డ్రి సరసంబులచే సంతసింపక జాగిలినమస్కరించె॥

గీ॥ అట్లు దండంబు నీశ్వరుకాచరించి
యేల ననుఁబుట్టఁజేసితి వెఱుఁగఁజెప్పు
వలయుకార్యంబుసాధింపఁ గలను నాదు
తండ్రి! యాపనిదెల్పుమ తక్షణమున॥

వ॥ అనిన శంభుండిట్లనియె॥

పం॥ ధరిత్రిలోన దైత్యుఁడైన దారకుండు వీఁడై
సురేంద్రుపీటిలోన వేగఁ జొచ్చి బాధబెట్టుచున్
ధరిత్రిఁదన్ను నెవ్వఁడైనఁ దాక లేఁడటంచుఁదా
దురాత్ముఁడై నటొపు మాడెఁ ద్రుంచిరమ్ము పుత్రకా॥

వ॥ అని యివ్విధంబున నాతింగించు॥

క॥ అడుగడుగునకును లోకము
గడగడవడకఁగ ధ్వనులు గగనములెగయున్
వడివడిగా నడచుచుఁదా
వెడలి హరునిసుతుఁడు సురలపీటిం జేరెన్॥

వ॥ యిట్లుజని తారకాసురుని నెలవుకుం జనుచుండఁ దారకుండాతని పా
దములచప్పుడులువిని యబ్బురమొంది గొబ్బున లేచివచ్చి కుమారు
నింగాంచి కన్నుల నిప్పులు కుప్పలుఁరాల నాతనితో నిట్లనియె॥

మ॥ వెరపుం జెందక వచ్చెదీవు నేఁడవో పిరుంద నన్గల్వ నీ
తరమే పోరఁగ వజ్రియున్ భయముఁ జెందఁగ నీకు శక్యంబె నా
శరముష్టిన్ నిముఁగూల్తు నీమశిరముల్ ఖండించెదన్ జూడు నా
శరమై పోయెదు తెల్విఁ దెచ్చుకొని పొమ్మా వేగ నీవిటకున్॥

క॥ నామహిమ నాబలము నా
సామర్థ్యము నెఱుఁగనట్టి జనుఁడునె యీ
భూమండలమధ్యంబున
నేమాత్రపువాఁడవీవు యిటననుఁ గెలువన్॥

వ॥ అనిన కుమారస్వామి యిట్లనియె॥

చ॥ వెరపొక యింత లేక యిటుఁ బ్రేలుచునుండెద వేల మూర్ఖ నీ
గరువమడంతు దేవతనికాయము సంతసిలంగఁ జేతు నీ

పరిజనంబుల్లవచ్చినను బారఁగఁదో లెద శంభుపుత్రుఁడం
చెరుగుమునన్ను నేను వధియించెదఁజూడుము నిన్ రణంబునన్॥

వ॥ మఱియు నిట్లనియె॥

గీ॥ సురవిభుఁడు దేవతలు నినుఁజూచిపాఱి
పోయినట్టుల నేఁబాఱిపోనునిన్ను
కత్తి కోకకంఠగాఁ జీల్చి కాకములభు
జింపఁజేసెద నన్ను వంచింపఁగలవె॥

వ॥ ఇక్కరణి ముక్కంటిసుతునిపలుకుల కా రక్కసుని కోపాగ్ని రెట్టింప
నాతండు దనఘోరతరమగు నొకగదం దీసి కుమారునిపైవైవ, నంత
నాకుమారస్వామి దననిరుపమానచాతుర్యంబుచే దనపైఁ కతిరయం
బున నేతెంచుచున్న గద ననేకఖండంబులుగా నొనరించె. ఇట్లు ని
ష్ఫలంబైన తనగదం గాంచి తారకుండు యబ్బురమొంది మరల వే

రొకగద నాబాలునిపైపై వ దానింగూడఁ దొల్లింటిక్రియఁగావించి
యుప్పరారిసుతుం డొక్కశరంబుఁబూని సురారిపైనేసె. ఆరాహు
నుండ బాలుఁడు శరంబులువేయునే కాని తనప్రాణంబులుండెడు లిం
గంబుంగూర్చిన మర్మంబు దెలిసికొనలేఁడని లోలోనసంతసించుచు
నాతండు వేసిన శరంబుఁదప్పించుకొని జంకెక మత్తవృషభంబుమా
డ్కి అంకెలవైచుచు నాతనిపైకురికి పోరఁజొచ్చె. ఇట్లిరువురు
నిరువదియొక్కదినంబులు ఘోరసంగ్రామంబుగావించిరి. అట్టితరి ష
ణ్ముఖుండు దారకుని ప్రాణమర్మంబు మున్నె తనతండ్రిచే నెఱింగిన
వాఁడుగావున నొక్కఘోరశరంబునఁ దారకుని మెడయందలి లిం
గంబు దుత్తునియలుగావించె॥

క॥ తారకుఁడంతటధరపై
ఘోరంబగుకొండవగిదిఁ గూలి కినుకతో

ధారుణి వడఁకఁగ నరచి కు
మారుని దార్ఢ్యత నుతించి మరణిం చెన్నపా॥

కం॥ సురలంత సంతసంబునఁ
గురిపించిరి పుష్పవృష్టి గుంభినిమీఁదన్
మురయుమఁ బాటలఁ బాడిరి
హరపుత్రునిఁ బూజసలిపి రధికప్రీతిన్॥

వ॥ ఇట్లు కుమారస్వామి సురలచే వేర్వేరువిధంబులఁ బూజింపంబడి
యాతని కాసమయంబునుండి కేటికిని నిలయంబుగానున్న భీమనది
కేతెంచెనని చెప్పిన విని ధర్మజుండు సూతునింజూచి మునివరా! కు
మారభగవంతుం డీవిధరకె తారకుని ప్రాణంబులా లింగమందుండె
నని తెలిసియుఁ జంపుటకన్ని దినంబులు పోరాడుటకుఁ గారణమేమ
నిన మునీంద్రుం డిట్లనియె॥

క॥ ధరణీశ దనుజుఁ ద్రుంచఁగ
హరసుతునకు నిమిషమాత్రమగు దనుజబలం
బరయుటకెట్టులఁ బోరెను
పరికింపఁగ దనుజుఁడతని బలముకుఁ దగునే॥

వ॥ అని పొగడియునిట్లనియె. ఓ ధర్మరాజా! కుమారస్వామి బాణంబు
చే దారకునిలింగంబు తునుకలయ్యెనని యిదివరకే నుడివితిని. ఆ
తునకలన్నియు భూలోకంబున నైదు ప్రదేశంబులంబడి చూచినప్ర
జలందరు నెఱవు జెందునట్లు బెరుగుచుండె. వానియందొకలింగంబ
ధికంబుగ బెరుఁగుచుండె. అంతనింద్రుండు తన బాధమాన్పిన కు
మారస్వామిని నుతించుచు తనపురిపాలించుచు నొకనాడు సుఖాసీ
నుండై భూలోకమున లింగంబు బెరుఁగు విచిత్రంబు దారకునిమహి
మావిశేషంబును జాటుచున్నదనియు నాతఁడు ధన్యుఁడనియు ను

తించి యంతమహానుభావుండు దనపురింజచ్చుటచేఁ దనకేమైన పా
పంబు వాటిల్లునని భయంపడి యాపాపంబు భూలోకమున నొకచోఁ
బడి పెరుగుచున్న యాతనిలింగంబు మాత్రపూర్వకంబుగఁ బ్రతి
ష్ఠించినచోఁ బోవునని నిశ్చయించి తనపరివారంబుతోఁ డను మునిగ
ణంబులతోఁ డను కరీంద్రంబు నెక్కి పయనంబై భూలోకంబునకేతెం
చి తన గురువగు బృహస్పతిచే నిర్ణయింపంబడిన యొక శుభలగ్న
మున నాలింగంబును యుక్తంబుగఁ బ్రతిష్ఠించె. పిమ్మట శుక్రుం
డింద్రుంజూచి, ఇంద్రా! ఈప్రదేశంబునఁ గొంతకాలంబునకు గృష్ణ
యను నొకనది యుద్భవించి యాలింగంబు పయింబారుఁ గాన నిది
యాలింగము నుంచుటకు యుక్తస్థలంబుగాదనిన శచీనాథుండు మిన్న
కుండిన వసిష్ఠుండుఁ శుక్రా! అట్లు చింతింపనేల? ఇచట నొకనదియు
ద్భవించునేని యది నావాక్యమహిమావశంబున నీలింగంబు దెసరా

క నొలగిపోవునని చెప్పెను అంత బృహస్పతి యింద్రుంజూచి
యిట్లనియె.

సీ॥ అమరేశయీ దేవ దమరేశ్వరాభిఖ్య నిక ముందు పేర్వడు నీస్థలమున
పట్టణంబొక టుద్భవమొందనిచ్చోట బహుజనధనవన భరితమగు
చు॥ యమరావతియనంగ నావురశ్రేష్ఠమీ యమరేశుడనుపేర న
లరుచుండు॥ ఈదేవుసన్నిధి నిచ్చోట నిదియొక క్షేత్రరాజంబయి
కీర్తిగాంచు॥

గీ॥ రాజశేఖరా యీపురి రాజధాని
గాంగ దమరాజ్యముల నేలంగలరు ధర్మ
వంతులకుం బుణ్యులకు భక్తివరులకావు
రంబుగాపురమగు సురరాజరాజ॥

వ॥ అనిన నింద్రుండిట్లనియె॥

కం॥ ధరణిలోపల నీచరిత్రంబు నెవఁడు
వినిన జదివినఁ బాపంబు వీడిపోయి
పుణ్యుఁడగు మను సౌఖ్యముల్ పొంది యుర్వి
వదలి యంతమునఁ జివరకు స్వర్గమునకు॥

వ॥ సురనాథుఁడిట్లానతిచ్చి పరివారంబుతో సురలోకంబున కేగె
ఓ ధర్మరాజా! తరువాత కొన్ని దినంబులకు శుక్రుండు చెప్పినట్లు కృ
ష్ణానదియు బృహస్పతి చెప్పినట్లమరావతియను నొకపట్టణంబు నుద్భ
వించె. ఆపట్టణవాసులు కొందఱుకలసి యీయమరేశ్వరున కొక
యాలయంబుఁ గట్టించిరి. కాని యద్దేవుండు దన్నుఁ బ్రతిష్ఠించిన తరు
వాతఁగూడ వెలుఁగుచునేయుండుటఁ జేసి కొన్నినాళ్ళకా యాలయ
ము బ్రద్దలు జేసికొని పైకెగసెను. అంత నాయూరిప్రజ లేమిచేయు
టకుఁదోచకున్నతరి నొకరాత్రి నీయమరేశ్వరుండు వారియందొకని

కి స్వప్నంబునదర్శనంబిచ్చి తానమహేశ్వరుండననియుఁ దనశిరంబున నొకబంగారుపిలకగ్రాట్టినఁ దానంతటఁ బెరుగకుండుననియుఁజెప్పెను. అంతవారందరు నదియెట్లగు యత్నముచేసిరి. దానికి దృష్టాంతముగ నచ్చట నిప్పటికి నాసీలయు లింగమున రెండువైపులను శిరంబునుండి జారియున్న పాలనత్తుటిచారలును గాన్పించును. ఇకముందున్నట్లు గాన్పింపగలవు. ఈధారల నాయుమహేశ్వరుండు దనప్రభావంబుఁబ్ర జలకుజూపి వారుతనయందు భక్తిగలవారై కై జేసె.

గీ॥ అచటఁబ్రతిశివరాత్రికి హారునిసేవ
జరుగుచుండును మిక్కిలి సంభ్రమముగ
నట్టిపునయాత్రజూడ నాపట్టణమున
కరిగెదరు పెక్కుయాత్రికు లవనినాథ॥

క॥ అచ్చటనమరేశ్వరునకు
ముచ్చటగా సేవజరుగు మూఁడుదినంబుల్
అచ్చటిజనములు పిమ్మట
విచ్చేయుమనాపురంబు వీడి నరేంద్రా॥

వ॥ నరేంద్రా! నే నెఱింగినకథనంతయు వినుపించితిని. ఇంక నీవు పుణ్యశీలుండవయ్యెదు. అదియునుగాక నీమేనమరందియగు శ్రీకృష్ణుని కరుణవలన నీసర్వరాజ్యంబును పొందగలవు.

క॥ అనినుడువు మాతుపలుకుల
విని ధర్మజుఁ డబ్బియపుడు వేమరునూతున్
మునుపని కొనియాడుచుదాఁ
జనియెను తమ్ములనుగూడి సంతోషముతోన్॥

సంపూర్ణము.

